# దేవుని శక్తి స్వరూపాలు

నేడు మానవుడు నివసించుచున్న ప్రపంచం శక్తిమయ ప్రపంచం అని చెప్పవచ్చు. మానవుడు తెలుసుకున్న ప్రాథమిక సూత్రాల ప్రకారం పని చేసే పటిమ (Capacity) ను **శక్తి** అంటారు. యావత్తు విశ్వంలో ప్రతి పదార్థానికి శక్తి ఉంది. **"ఎనర్జీ"** అనే పదం **"ఎన్ ఎర్జియా"** నుండి వచ్చింది. దీని అర్థం కృత్యము లేదా పని. ఏ వస్తువయినా శక్తిని రెండు రూపాలుగా పొంది ఉంటుంది.

**1. స్థితి శక్తి (Potential Energy) 2. గతి శక్తి (Kinetic Energy)** వస్తువు దాని స్థానం వల్ల గాని స్థితి వల్ల గాని లభించే శక్తిని స్థితి శక్తి అంటారు. వస్తువు దాని గమనం వలన లభించే శక్తిని గతిశక్తి అంటారు. ఒక వ్యవస్థలో పని చేయగల సామర్థ్యతను శక్తి అనవచ్చును. సౌరవ్యవస్థ నుండి శరీర వ్యవస్థ వరకూ శక్తి అంతర్లీనంగా ప్రతి వ్యవస్థలోనూ చూడగలం. పని చేయడానికి గల సామర్థ్యాన్నే శక్తి లేక ఎనర్జీ అంటారు. ఈ శక్తి ప్రకృతిలో వివిధ రూపాలలో ఉంటుంది. అది **కాంతి శక్తి, (Light Energy), ఉష్ణ శక్తి, (Heat Energy), ధ్వని శక్తి (Sound Energy)** మొదలైనవి. ప్రథమమైన ఈ మూడింటి నుండి జీవి మనుగడ సంభవమవుతుందని మొదట గ్రహించగలగాలి. యావత్తు ప్రకృతి అంతయూ ఈ మూడు శక్తులను కలిగి ఉన్నది. వీటి నుండి మానవుడు తన విజ్ఞానంతో అనేక శక్తులను సంగ్రహించగలుగుతున్నాడు. విద్యుచ్ఛక్తి, యాంత్రిక శక్తి, అయస్కాంత శక్తి మొదలైనవి. ఈ శక్తి కలిగిన ఒక ప్రాముఖ్యమైన లక్షణాన్ని ఇక్కడ మనం అధ్యయనం చేయగలగాలి. **"శక్తి అనేకరూపాలను కలిగి ఉన్నా దానిని ఒకరూపం నుండి మరొకరూపంలోకి మార్చవచ్చును."** అనగా ఒక రూపములో అది అదృశ్యమైనా తిరిగి మరో రూపంలో అది ప్రత్యక్షమవుతుంది దీనిని బట్టి శాస్త్రం తేల్చి చెప్పిన సంగతి ఏదనగా **"శక్తికి నాశనం లేదు"** దీనినే శక్తి నిత్యత్వం అంటారు. ఈ శక్తి అధ్యయనంలో మానవుడు తెలుసుకున్న మరొక అద్భుత విషయం ఏదనగా **"శక్తిని ఉత్పత్తి చేయలేము - విచ్ఛిన్నం చేయలేము"** అనగా మనం శక్తిని సృష్టించలేము, నాశనం చేయలేము, గానీ శక్తిని ఒక రూపం నుండి మరొక రూపంలోకి మార్చవచ్చు. దీనంతటిని బట్టి మనం గ్రహించవలసిన ముఖ్యాంశం ఏదనగా శక్తికి నాశనం లేదు. తన రూపాన్నయితే శక్తి మార్చుకొనగలదేమో గానీ అది విచ్ఛిన్నం కాలేదను సంగతి స్పష్టముగా ఉన్నది. ఈ విషయాన్ని ధృవీకరించడానికి మనిషికి ఎన్నో వేల సంవత్సరాల కాలం పట్టి 16, 17, 18 శతాబ్దాల మధ్య కాలంలో జన్మించిన Issac Newton, James Prescott Joule, John Dalton లాంటి కొందరు శాస్త్రవేత్తలు ధృవీకరించి సూత్రాల ద్వారా వెల్లడిపరిస్తేనే గానీ ఈ యావత్ప్రపంచం నమ్మలేదు. వారు చేసిన పరిశోధనల కారణంగా ప్రపంచానికి ఎంతో కనువిప్పు కలిగించిందని మానవాళి భావిస్తుందే గానీ శాస్త్రాలకు అతీతంగా దేవుడు తన వేదమైన బైబిలు గ్రంథము నందు విజ్ఞులకే పాఠాలను నేర్పించే అంశాలను భద్రపరిచాడను సంగతిని నేడు మీరు గమనించగలగాలి.

**హెబ్రీ 7 : 15 - నాశనము లేని జీవమునకున్న శక్తిని బట్టి.......**

ప్రకృతి అంతా శక్తి లేక జీవం గలిగి ఉన్నదన్నమాట వాస్తవమైనప్పుడు ఆ శక్తి లేక జీవానికి నాశనమే లేదు అన్న సంగతిని క్రీ.శ. సుమారు 64వ సంవత్సరములోనే దేవుడు బయలు పరిచాడు. శక్తిని లేక జీవాన్ని మనిషి నాశనం చేయలేడు. ఎందుకనగా అది నిత్యమైనదని దానికెన్నటికినీ నాశనం లేదను నిజాన్ని శాస్త్రజ్ఞులైన వారికి నాభి కోయకముందే బైబిల్ ఢంకా వేసి చెప్పింది. "energy can neither be created nor destroyed" అన్న సూత్రాన్ని వాడుకలోనికి తెచ్చారే గానీ దానికి ముందే బైబిలు ఘంటా పదంగా చెప్పిన విషయాన్ని నేటి ప్రపంచం ప్రక్కకు పెట్టింది. ఈ ప్రకృతి అంతటిలో నిత్యత్వం దాగి ఉందని అది నాశనం కానిదని శాస్త్రం చెప్పగలగుతుందే గాని ఆ నిత్యత్వం లేక శక్తి ఈ ప్రకృతిలోనికి ఏలాగు ఎక్కడ నుండి ప్రవహిస్తుందనే విషయం నేటి ఆధునిక శాస్త్రానికి ఇప్పటి వరకూ అగమ్యగోచరంగానే ఉన్నది. శాస్త్రం ఉన్నవాటిని గూర్చి మాత్రమే ఆలోచించగలుగుతుంది గాని ఉన్నవాటికి ఆ శక్తి ఏ కేంద్రం నుండి వచ్చుచున్నదోనన్న విషయం రహస్యంగానే ఉన్నది. దీనికి జవాబు చెప్పగలిగే ఏకైక మొనగాడు బైబిలు తెలిసిన క్రైస్తవుడు మాత్రమే.

**ఎఫెసీ 1 : 8, 9 - కాలము సంపూర్ణమైనప్పుడు జరుగవలసిన ఏర్పాటును బట్టి, ఆయన తన దయాపూర్వక సంకల్పము చొప్పున తన చిత్తమును గూర్చిన మర్మమును మనకు తెలియజేసి, మనకు సంపూర్ణమైన జ్ఞానవివేచన**

కలుగుటకు ఆ కృపను మన యెడల (క్రైస్తవుని) విస్తరింపజేసెను.

**1 కొరింథి 2 : 7 - దేవుని జ్ఞానము మర్మమైనట్టుగా బోధించుచున్నాము. ఈ జ్ఞానము మరుగైయుండెను. జగదుత్పత్తి ముందుగానే దీనిని దేవుడు మన మహిమ నిమిత్తము నియమించెను.**

ఎప్పటికైనా ఈ ప్రపంచానికి కనువిప్పు క్రైస్తవుడే కలిగించాలి. శాస్త్ర ప్రపంచానికి అర్థం కాని సంగతుల పైన జ్ఞానియైన దేవుడు మన మహిమ నిమిత్తం సృష్టి పుట్టకముందే భద్రపరిచియున్నాడు గనుక అంతటి యుక్తమైన సంగతులను తాము జ్ఞానులమని చెప్పుకున్న వారికి మనం ప్రకటించగలగాలి. ఒక రైలు బండి శక్తి గలిగి నడుచుచున్నదంటే అందులోని శక్తి వివిధ రూపాల్లో ఉత్పత్తి జరిగి పనిని జరిపిస్తుందని మొదట గ్రహించాలి. బొగ్గు, డీజిల్ లేక విద్యుశ్చక్తి ద్వారా శక్తి ఉత్పన్నమవుతుంది. ఆ శక్తి ద్వారా పని సాధ్యమవుతుంది. అనగా రైలుబండి యొక్క శక్తి ఉత్పత్తికి కారణం బొగ్గు, డీజిల్ లేక కరెంటు మరి ఈ మూడు ఎక్కడ నుండి వచ్చినవి? బొగ్గు, డీజిల్ ప్రకృతిలో లభ్యమయ్యే వనరులు కరెంటు నీటి వలన ఉత్పత్తి అయ్యేది. ఇలా ఈ మూడింటికీ కేంద్రం నడవడానికి ప్రకృతి మూలమైతే మరి ప్రకృతి నడవడానికి శక్తి ఎక్కడ ఉత్పత్తి అవుతున్నట్లు? ఆలోచించండి శాస్త్ర ప్రపంచం-ఈ ప్రకృతిలో శక్తి దాగి ఉన్నదే గాని అది ఎక్కడ నుండి సరఫరా జరుగుతుంది అన్న ప్రశ్నలకు జవాబులను ఇవ్వలేదు. కారణం శాస్త్రవేత్తలకు దేవుని జ్ఞానం అర్థం కాలేదు గనుక. ప్రకృతిలో శక్తికి మరో రూపం సూర్యుడు. భూమి మీద పవనాలు వీయడానికి, జలచక్రం ఏర్పడడానికి శక్తినిస్తూ సమస్త జీవరాసిని పోషించుచున్నాడు. వృక్షాలు, ఈ శక్తితో కిరణ జన్య సంయోగ క్రియ ద్వారా తమ ఆహారాన్ని తయారు చేసుకొంటూ భూమి మీద మానవులకు జంతువుల మనుగడకు ఆధారమౌతున్నాడు. సూర్యరశ్మి లేకుంటే భూమి శీతల నిర్జీవ గ్రహంగా ఉండేది. భూమి మీద సమస్త జీవకోటికి మాత్రమే కాక సౌరకుటుంబంలోని ప్రతి గ్రహానికి శక్తిని అందిస్తూ తన ఆకర్షణకు లోను చేసుకొనే శక్తి కూడా కలిగి ఉన్నాడు. కాంతిజనకంగా మనం వర్ణిస్తున్న ఈ సూర్యునికి ఇంతటి శక్తి ఎక్కడ నుండి వచ్చుచున్నది ? 1800 కోట్ల సంవత్సరాలుగా మండుతున్నా తన వెలుగు, వేడిమి ద్వారా జీవకోటికి ప్రాణం పోస్తున్న సూర్యునికి శక్తి ఎక్కడ నుండి వస్తుందని శాస్త్రం చెప్పినా అటువంటి పదార్థాలు ఆ గ్రహంలో ఉంచినదెవరు ? దానిలో ఆ పనిని జరిగిస్తున్న శక్తి ఏది ? ఈ ప్రశ్నలకు శాస్త్రమును బట్టి మనకు అర్థమైన విషయమేమిటంటే ఈ యావత్తు ప్రకృతికి అతీతంగా శక్తిని ప్రసరింపజేస్తున్న ఒక కనబడని మహాశక్తి ఈ విశ్వంలో దాగి ఉంది. ప్రకృతిలో జరుగుతున్న ఈ కార్యాల వెనుక దాగి ఉన్న మహా కర్షక శక్తే దేవుడు. సృష్టింపబడిన సమస్తములోనూ ఆయన శక్తి స్వరూపం దాగి ఉన్నది. ఆ మహోన్నతుని గూర్చిన సంగతులు ఒక్క బైబిలు ద్వారా తప్పితే మరొక విధంగా ఈ శాస్త్ర ప్రపంచానికి ఎన్నడునూ అర్థం కాలేవు. ఆయనను గూర్చి తెలుసుకొనదలిస్తే మహా వేద సముద్రమైన బైబిలును పఠించగలిగితే జీవాన్ని గూర్చిన సంపూర్ణ వివరణ మనము పొందగలము. మన నిమిత్తమై దేవుడు తనను గూర్చిన అనేక సంగతులను భద్రపరచి ఉంచాడు.

**1 తిమోతీ 6 : 16 సమీపింపరాని తేజస్సులో ఆయన మాత్రమే వసించుచూ అమరత్వం గలవాడై యున్నాడు.**

పై మాటను బట్టి దేవుడు తేజస్సులో లేక ప్రకాశమానమైన వెలుగులో నివసించువాడని ఆయన అమరుడని లేక నాశనము లేని వాడని అర్థమగుచున్నది. ఈ విశ్వమంతటినీ తన అపూర్వమైన శక్తి ద్వారా నడిపించుచున్న అదృశ్యుడే దేవుడు. అమర్త్యుడైన దేవుడు తన మహత్తు గల మాట ద్వారా ఈ యావత్తు సృష్టిని సృజించినాడు. నిత్య శక్తిమంతుడైన దేవుడు తను పలికిన శబ్ధం ద్వారా విశ్వాన్ని కలుగజేసాడు గనుకనే విశ్వమంతటిలోనూ తన మాట దాగి ఉంది. ఆ మాటలో శక్తి దాగి ఉంది, బలము దాగి ఉంది.

**హెబ్రీ 4 : 12 దేవుని వాక్యము సజీవమై, బలము గలదై..............**

**హెబ్రీ 11 : 3 ప్రపంచములు దేవుని వాక్యము వలన నిర్మాణమైనవి.......**

**కీర్తనలు 33 : 62 యెహోవా వాక్కు చేత ఆకాశము కలిగెను. ఆయన నోటి ఊపిరి చేతవాటి సర్వ సమూహము కలిగెను. ఆయన మాట సెలవియ్యగానే దాని ప్రకారమాయెను. ఆయన ఆజ్ఞాపింపగానే కార్యము స్థిరపరచబడెను.**

సర్వశక్తుడగు దేవుని వాక్కులో జీవం దాగి ఉందను సంగతి పై వచనాలను బట్టి విశదమగుచున్నది. కనిపించుచున్న ప్రకృతిని కనబడని శక్తిగా ఆయన మాట నడిపించుచున్నది. ఆయన మాటలో జీవం లేనిదే ప్రకృతిలో ఏదియూ జీవం కలిగి చలించదు, పని చేయదు. మన ఇంటిలో ఒక బల్బు వెలగాలంటే విద్యుత్ కేంద్రం నుండి భారీ స్థంబాల ద్వారా, ట్రాన్స్‌ఫార్మర్‌ల నుండి కరెంటు ప్రయాణం చేసి తీరాలి. ఈ మధ్యలో ఎక్కడ అంతరాయం కలిగినా మనకు వెలుగు ఉండదు. ఒక యంత్రం ఆగకుండా పని చేయాలి అంటే శక్తి నిరాటంకంగా ప్రవహించగలగాలి. ఇవి మన కళ్ళ ముందు జరుగుచున్న నిత్యసత్యాలైనప్పుడు నిరంతరం వెలిగే సూర్యుడు, మిల మిల మెరిసే నక్షత్రాలు, ఆగకుండా తిరిగే భూమి, జరిగే కాలాలు, మారే ఋతువులు, ఇవన్నీ ఇంత క్రమంగా జరుగగలుగుతున్నాయంటే వీటన్నిటికీ నిత్య శక్తి నిత్యుడైన దేవుని నుండి ప్రతినిత్యం ప్రవహిస్తూనే ఉంది. అదే ఈ విశ్వంలో దాగిన "మహాకర్షక శక్తి" గా శాస్త్రం పిలిస్తున్న పేరు. ఆ జీవము యొక్క ఉనికిని మనం ప్రకృతిలోని ప్రతి అణువునందూ చూడగలము. పంచభూతాలలో దేనిని పరిశీలించినా ఆ జీవము యొక్క లక్షణాలను చూడగలమని బైబిలు ప్రభోదించుచున్నది. నేటి ఆధునిక శాస్త్రం ధృవీకరించి అంగీకరించిన సంగతులేవనగా సమస్త విశ్వం ఒక మహా విస్ఫోటనం వలన సంభవించినదని, దానినే Big Bang Theory గా పరిగనించుచున్నది. కనబడని శక్తి లేక ధ్వని కనిపించే ఈ ప్రకృతిని సృజించినదని నేడు శాస్త్రం చెబుతున్న సంగతులు ఏనాడో బైబిలు నందు దేవుడు వ్రాయించినాడు.

**హెబ్రీ 11 : 3 ప్రపంచములు దేవుని వాక్యము వలన నిర్మాణమైనవనియు, అందును బట్టి దృశ్యమైనది కనబడెడు పదార్థములచే నిర్మించబడలేదని విశ్వాసము చేత గ్రహించుచున్నాము.**

**రోమా 4 : 17 లేనివాటిని ఉన్నట్టుగానే పిలచువాడునైన దేవుడు మనకందరికీ తండ్రియైఉన్నాడు.**

**కీర్తన 33 : 6 యెహోవా వాక్కు చేత ఆకాశములు కలిగెను. ఆయన నోటి శ్వాసము చేత వాటి సర్వసమూహమును కలిగెను.**

గనుక పంచభూతాలలోనూ దాగి ఉన్నది అదృశ్యమైన ఆయన మాట అనగా కనిపించుచున్న వాటన్నిటి ప్రారంభమునకు మనము వెళ్ళినచో అది కనబడకుండా ఉండే స్థితి కలుగుతుంది. పదార్థము విభజించుకుంటూపోతే అణువు, పరమాణువు చివరకు శక్తిగా కనిపించని రూపం దాల్చుతుంది అలాగే నీరును విభజించుకుంటూ పోతే హైడ్రోజన్, ఆక్సిజన్ వాయువులుగా కనబడని రూపంలోనికి మారిపోతుంది. ఇలా ప్రకృతిలోని ప్రతి పదార్థం కనిపించని స్థితి నుండి వచ్చినదే ఎందుకనగా వాటిని కనిపించని అదృశ్య శక్తియైన జీవము గల దేవుడు సృజించినాడు గనుక,. మన కంటికి కనిపించుచున్న దేని చివరిదశనైనా మనం చూడదలిస్తే అది కనిపించని దశకే చేరుతుంది. దేవుడు తన జీవము కలిగిన మహత్తు గల మాట చేత సమస్తాన్ని సృష్టించియున్నాడు. గనుక ఆ కనబడని శక్తి లేక ఎనర్జీ సృష్టిలోని ప్రతి పదార్థములోనూ మనం చూడగలము.

**రోమా 1 : 20 దేవుని అదృశ్య లక్షణములు, అనగా ఆయన 'నిత్య శక్తి' 'దేవత్వం' జగదుత్పత్తి మొదలుకొని సృష్టింపబడిన వస్తువులను ఆలోచించుట వలన తేటపడుచున్నవి. నిత్యుడైన దేవుని యొక్క నిత్యత్వం ఆయన సృజించిన సమస్తమైన వాటిలోనూ మనం చూడగలం.**

**యోబు 12 : 7, 8 భూమి ని గూర్చి ధ్యానించిన యెడల అది నీకు బోధించును మృగములను విచారించుము అవి నీకు తెలియజేయును సముద్రములోని చేపలు, ఆకాశ పక్షులు నీకు వివరించును.**

విశ్వమంతటికీ తన అపరిమితమైన శక్తి భాండారాల నుండి జీవాన్ని ప్రసాదిస్తూ ప్రకృతిని పరిభ్రమింపజేయు చున్నాడు. ఆయన నుండి శక్తి, జీవము నిరాటంకముగా ప్రవహిస్తున్నది గనుకనే ప్రకృతిలోని సమస్తమూ చలనము కలిగి, జీవము కలిగి పనిచేయుచున్నదను సంగతి ఈ శాస్త్ర ప్రపంచం గ్రహించగలగాలి. వెలుగుతున్న సూర్యుడు ఇంత ఇంధనంతో మండుతూ ఇంత ఉష్ణాన్ని ఇవ్వగలుగుతున్నాడని చెప్పగలరే గానీ ఆ శక్తి ఆగితే పని చేయించే సమర్థత లేని చేతకాని వారనే చెప్పాలి. దేవుని జీవము యొక్క ఉనికి ఇంత ప్రస్ఫుటముగా వారి కళ్ళకు కనబడుతున్న దేవునిని విశ్వసించలేని

మూర్ఖులుగా నేటి శాస్త్రజ్ఞులు మారారు. ఋతుపవనాలు రాని కారణంగా వర్షం కురవదని చెప్పగలరే గాని వాటిని వచ్చేటట్లు చేయలేని అసమర్థులనే చెప్పాలి. దీనిని బట్టి సమస్తాన్ని నడిపిస్తూ, జీవింపజేస్తున్న మన జీవము గల తండ్రికి మానవుడు కృతజ్ఞతాస్తుతులు చెల్లింప బద్ధుడైయున్నాడు.

**యోబు 38 : 34 జలరాసులు నిన్ను కప్పునట్లు మేఘములకు నీవు ఆజ్ఞ ఇవ్వగలవా?**

**రోమా 1 : 21 వారు దేవునిని నెరిగియూ ఆయనను దేవునిగా మహిమపరచలేదు, కృతజ్ఞతా స్తుతులు చెల్లింపనూ లేదు గాని తమ వాదములయందు వ్యర్థులైరి.**

**అపో.కా. 17 : 25 ఆయన అందరికీ జీవమును, ఊపిరిని సమస్తమును దయచేయువాడు.**

**అపో.కా. 14 : 17 ఆయన ఆకాశము నుండి మీకు వర్షమును, ఫలవంతమైన ఋతువులను దయచేయుచూ, ఆహారమును అనుగ్రహించుచూ ఉల్లాసముతో మీ హృదయములను నింపుచూ, మేలు చేయుట చేత తన్ను గూర్చి సాక్ష్యము లేకుండా చేయలేదు.**

ఈ సమస్త కార్యాలనూ నిర్వహించుచున్న ఆ మహోన్నతుని శక్తి స్వరూపాలను కొద్దిగా అధ్యయనం చేద్దాము. జీవమన్న పదానికే ప్రారంభకుడు దేవుడు. ఆయన తనకు తానుగానే స్వయంశక్తి గలవాడే గాని ఆయన మాత్రం శక్తి సంగ్రహకుడు కాడు. ఆయన నిత్యత్వం గలవాడు, నాశనం లేనివాడు. ఆయనను ఒక శక్తిగా మనం పరిశీలించగలిగితే నేటి ఆధునిక శాస్త్రం చెప్పే సూత్రాల ప్రకారం శక్తిని **ఉత్పత్తి చేయలేము** విచ్ఛిన్నం **చేయలేము** చివరకు ఆ శక్తికి నాశనం లేదు. మానవుడు నేడు దీనిని తెలుసుకొనగలిగాడేమో గానీ తన నిత్యత్వాన్ని గూర్చిన వివరాలను దేవుడు ఏనాడో ఈ వేదమందు భద్రపరిచాడు.

**హెబ్రీ 7 : 3 అతడు తండ్రి లేనివాడునూ తల్లి లేనివాడునూ వంశావళి లేనివాడునూ జీవిత కాలమునకు ఆదియైనను జీవమునకు అంతము లేనివాడునై యున్నాడు.**

**యోహాను 5 : 26 తండ్రి ఏలాగు తనంతట తానే జీవము గలవాడై యున్నాడో అలాగే కుమారుడును తనంతట తానే జీవము గలవాడై యుండుటకు కుమారునికి అధికారము ననుగ్రహించెను.**

**యోహాను 6 : 57 జీవము గల తండ్రి నన్ను పంపెను గనుక నేను తండ్రి మూలముగా జీవించుచున్నట్టే నన్ను తినువాడునూ నా మూలముగా జీవించును.**

**నిర్గమా 3 : 14 దేవుడు - నేను ఉన్నవాడను అనువాడనై యున్నాను. ఉండుననువాడు మీ యొద్దకు నన్ను పంపెనని నీవు ఇశ్రాయేలీయులతో చెప్పవలెను.**

**ప్రకటన 4 : 8 భూత వర్తమాన భవిష్యత్కాలములలో ఉండు సర్వాధికారియు దేవుడునగు ప్రభువు.......**

పై వచనాలను బట్టి దేవుడు నిత్యుడనియు ఆయన జీవానికి ప్రారంభం గాని నాశనం గాని లేదనియు, సర్వ కాలాల్లో ఉండువాడనియు అర్థమగుచున్నది. శక్తికి ప్రారంభం లేదు, నాశనం లేదను సత్యాన్ని శాస్త్రం మొన్నే వెలికి తీసినా సకల శాస్త్రాలనూ అధిగమించే బైబిల్ శాస్త్రవేత్తలకే పాఠాలను ఏనాడో నేర్పించింది. దీనిని ప్రతిపాదించిన Einstien లాంటి శాస్త్రవేత్తలకే ఈ మూర్ఖ ప్రపంచం పట్టం కట్టిందే గానీ వారికే ఓనమాలను దిద్దించిన బైబిలును ప్రక్కకు నెట్టింది. దేవుని దయ వలన సమస్తాన్ని అనుభవిస్తూ అంతటి మహనీయుని జ్ఞానాన్ని ప్రక్కకు నెట్టిన ఈ శాస్త్ర ప్రపంచం యొక్క మాడు పగులగొట్టగలగాలి. ఈ భాగ్యాన్ని నేడు ప్రతి క్రైస్తవుడు కైవసం చేసుకొనగలగాలి, తాను జ్ఞానినని చెప్పుకొను ప్రతివానిని బైబిలు ముందు సాష్టాంగపడవేయాలి.

**ఫిలిప్పీ 2 : 9, 10 పరలోకమందు గానీ, భూమి మీద గానీ భూమి క్రింద ఉన్నవారిలో గాని ప్రతివాని మోకాలును యేసు నామమున వంగునట్లు, ప్రతివాని నాలుకయు తండ్రియైన దేవుని మహిమార్థమై యేసుక్రీస్తు (వాక్యము) ప్రభువని ఒప్పుకొనునట్లు దేవుడు హెచ్చించియున్నాడు.**

ఈ యావత్తు విశ్వాన్ని నడుపుటకు అవసరమైన శక్తిని దేవుడు వివిధ రూపాలలో ప్రసాదిస్తూ పని చేయించుచున్నాడు. ఈ శక్తి పుట్టడానికి పని అవసరమై ఉంది. ఎందుకనగా పని లేకుండా శక్తి ఉత్పత్తి కాలేదు. ఒక జనరేటర్ తిరిగితేనే గాని శక్తిని ఎలా ఉత్పత్తి చేయలేదో మహాకర్షకశక్తియైన దేవుడు సమస్త కార్యాలను జరిగించకపోతే ఈ ప్రకృతిలో శక్తి ఉండనే ఉండదు. **1 కొరింథి 12 : 6 నానా విధములైన కార్యములు కలవు గాని అందరిలోనూ అన్నిటినీ జరిగించు దేవుడు ఒక్కడే.**

**యోహాను 5 : 17 యేసు - నా తండ్రి యిదివరకు పని చేయుచున్నాడు, నేనును పని చేయుచున్నాను.**

దేవుడు 6 దినాల సృష్టి అనంతరం విశ్రాంతిలో ఉన్నాడనే ఈ ప్రపంచం భావిస్తుందే గానీ కాస్త విశ్రమించిన తరువాత మరలా తన పనిలో దేవుడు బాధ్యత కలిగి కునకక, నిద్రపోక మన నిమిత్తం పని చేయుచున్నాడని ఎంత మందికి తెలుసు ? ఆ తండ్రే ఈ కార్యాలను జరిగించకపోతే ఇవన్నీయూ శక్తిహీనంగా మారిపోయేవి గనుక ఈ ప్రపంచానికి ఏయే రూపాలలో శక్తి కనిపిస్తుందో అవే శక్తి స్వరూపాలు ఆయన కూడా కలిగియున్నాడు. మీకు ముందుగా వివరించిన ప్రకారం ప్రకృతిలో శక్తి వివిధ రూపాలలో ఉంటుంది. **కాంతి శక్తి, (Light Energy)**, **ఉష్ణ శక్తి, (Heat Energy)**, **ధ్వని శక్తి (Sound Energy)** ఈ ప్రకృతిలో శక్తి ఏ రూపాలలోనైతే కనబడుతుందో దేవుడు కూడా ఆయా శక్తి స్వరూపాలు కలవాడై వివిధములైన కార్యాల ద్వారా శక్తిని ప్రసరింప జేయుచున్నాడు.

**1. కాంతి శక్తి :** జీవమై యున్న దేవుని యొక్క అనేక శక్తి స్వరూపాలలో అతి ముఖ్యమైనది కాంతి లేక వెలుగు ఒకటి. ఈ కాంతి లేనిదే మానవ మనుగడే ప్రపంచంలో లేదని చెప్పాలి. జీవరాసులన్నిటికీ అవసరమైన ఆహారం అందాలి అంటే వెలుగు ద్వారా కిరణజన్య సంయోగక్రియ ఒక్కటే మూలం. ఈ ప్రక్రియ వలన నివాసానికి అవసరమయ్యే కలప, ఇంధనానికి అవసరమైన వంట చెరుకు, బొగ్గు, పెట్రోలు వంటి పదార్థాలు లభిస్తాయి. భూమి మీద మొక్కలు లేనిదే జీవి మనుగడ లేదు. మరొక విశేషం ఏమిటంటే ఈ భూగ్రహం మీద కిరణ జన్య సంయోగక్రియ ఒక్కటే వాతావరణంలోకి ఆక్సిజన్ అందించి, జీవి మనుగడకు అవసరమైన విధానంలో వెలుగును గ్రహించి ప్రాణవాయువును అందిస్తున్న ప్రక్రియ.ప్రాణవాయువు ఉండాలి అంటే కిరణ జన్య సంయోగ క్రియ జరిగి తీరాలి. అంటే దీనిని బట్టి వెలుగు యొక్క ప్రాధాన్యత ఎంత అవసరమో మీరు గ్రహించగలగాలి. కాంతి శక్తి యొక్క రూపమైనప్పుడు దేవుని యొక్క స్వరూపాలలో కాంతి లేక వెలుగు స్వరూపం మొదటిదని మీరు గ్రహించగలగాలి. ఆ దేవాది దేవుడు వెలుగు స్వరూపంగా ఉన్నాడు గనుకనే శక్తిని ప్రసరింపజేయ సమర్థత కలిగి యావత్తు జీవకోటికీ ఊపిరిని, జీవాన్ని అందజేస్తున్నాడు. **1 తిమోతీ 6 : 16 సమీపింపరాని తేజస్సులో ఆయన మాత్రమే వసించుచూ అమరత్వం గలవాడై యున్నాడు.**

**కీర్తన 104 : 2 యెహోవా వస్త్రము వలె వెలుగును నీవు కప్పుకొనియున్నావు.**

**దానియేలు 2 : 22 వెలుగు యొక్క నివాస స్థలము ఈయన యొద్ద ఉన్నది.**

**కీర్తన 36 : 9 నీ యొద్ద జీవపు ఊట కలదు, నీ వెలుగును పొందియే మేము వెలుగు చూచుచున్నాము.**

**యోహాను 1 : 4, 9 ఆయనలో జీవముండెను; ఆ జీవము మనుష్యులకు వెలుగై యుండెను. నిజమైన వెలుగు ఉండెను. అది లోకములోనికి వచ్చుచూ ప్రతి మనుష్యుని వెలిగించుచున్నది.**

**2. ఉష్ణ శక్తి :** కాంతి ఎంత అవసరమో ఆ కాంతి నుండి వెలువడే ఉష్ణము లేక వేడి కూడా మనిషికి ప్రాణాధారమైనది. సూర్యుని వలన భూమి వేడెక్కడం వల్ల దాని సమీపంలో ఉన్న గాలి పొరలు వేడెక్కి పైకి వెళతాయి. అప్పుడు సముద్రం మీద చల్లని గాలులు భూమి మీదకు వస్తాయి. ఈ విధంగా ద్రవాలలో, వాయువులలో ఒక ప్రాంతం నుండి మరొక ప్రాంతానికి అణువులు వేడిని గ్రహించి మోసుకుపోతాయి. ఉష్ణము లేనిదే వర్షాలు భూమి మీద కురవవు. సముద్రాలు వేడెక్కి ఉప్పు నీరు మంచినీరుగా మారి యావత్తు మానవకోటికీ ప్రాణాధారంగా మారుతుంది. చివరకు మనిషి శరీరంలో కూడా తగినంత వేడి లేనిచో అతడు జీవించుట కష్టము. ఇలా ప్రకృతిలో సమస్తము సూర్యుడు, నక్షత్రాల నుండి వెలువడుతున్న ఉష్ణాల వలన ఆకర్షణకు గురై పరిభ్రమిస్తున్నాయి. భూమి కూడా పరిభ్రమించడానికి తనలో మండుచున్న

ఉష్ణము కారణమగుచున్నది. దేవాది దేవుడు వెలుగుగానే కాక ఉష్ణముగా ఎలా శక్తి రూపాన్ని కలిగి ఉన్నాడో బైబిలు నుండి పరిశీలిద్దాము. (యోహాను 28 : 5)

**- యోబు 28 : 5 భూమి లోపలి భాగము అగ్నిమయమైనట్లు ఉండును.**

**- యిర్మియా 23 : 29 నా మాట అగ్ని వంటిది కాదా ? బండను బద్దలు చేయు సుత్తె వంటిది కాదా ?**

**- నిర్గమా 13 : 21 యెహోవా త్రోవలో వారిని నడిపించుటకై రాత్రివేళ అగ్ని స్తంభములో ఉండి వారికి ముందుగా నడుచుచూ వచ్చెను. హెబ్రీ 12 : 29 ఏలయనగా మన దేవుడు దహించు అగ్నియై యున్నాడు.**

**- నిర్గమా 19 : 18 యెహోవా అగ్నితో సీనాయి పర్వతము మీదికి దిగి వచ్చినందున అదంతయూ ధూమమయమై యుండును. పర్వతమంతయు మిక్కిలి కంపించెను.**

**- యెషయా 66 : 15 మహా కోపముతో ప్రతీకారము చేయుటకును, అగ్ని జ్వాలలలో గద్దించుటకును యెహోవా అగ్ని రూపముగా వచ్చుచున్నాడు.**

**- యెషయా 10 : 17 ఇశ్రాయేలు యొక్క వెలుగు అగ్నియును అతని పరిశుద్ధ దేవుడు జ్వాలయునగును.**

**3. ధ్వని శక్తి :** ప్రకృతి అంతయూ శక్తిమయం అని మనం చదువుకున్న విధంగా ఈ కనిపించే పదార్థమంతటిలో ఎంతో శక్తి దాగి ఉంది. ఈ పదార్థమంతయూ ఇలా మారడానికి ఈ విశ్వంలో ఒక మహా విస్ఫోటనం సంభవించడం వలననే ఇవన్నియూ నిర్మింపబడ్డాయని ఆధునిక శాస్త్రం అంటుంది. కనిపించని ధ్వని కనిపించే పదార్థాన్ని కలుగజేసాయి గనుకనే పదార్థంలోని ఒక ఇసుక రేణువును విభజించుకుంటూ పోతే అందు పరమాణువు నుండి చివరిగా విడుదలయ్యేది అణు శక్తి లేక Atomic Energy. ఈ శక్తి తన మాటలో ఉన్నట్టుగా బైబిలు దేవుని యొక్క మరో శక్తి స్వరూపాన్ని చూపించుచున్నది.

**- యోబు 37 : 2 - 5 ఆయన నోట నుండి బయలు వెళ్ళు ధ్వనినాలకించుడి. ఆయన తన గంభీరమైన స్వరముతో గర్జించును, తన ధ్వని వినబడునప్పుడు ఆయన మెరుపును నిలిపివేయడు.**

**- యోబు 40 : 9 దేవునికి కలిగియున్న బాహుబలము నీకు కలదా ? ఆయన ఉరుము స్వరము వంటి స్వరముతో నీవు గర్జింపగలవా ?**

**- కీర్తన 29 : 3 యెహోవా దేవుడు ఉరుము వలె గర్జించుచున్నాడు.**

**- యోహాను 12 : 28, 29 అక్కడ నిలుచుండి వినిన జనసమూహము ఉరిమెననుకొనిరి.**

ఈనాడు మానవుడు దేనిని శక్తిగా భావిస్తున్నాడో ఆ శక్తి అంతటికీ ఆధారభూతుడు దేవుడు. ఏ ఏ శక్తుల రూపాలు ప్రపంచంలో మన ముందు కనబడుతున్నాయో వాటికి ఆ శక్తి సర్వోన్నతుడును శక్తిమంతుడైన దేవుని నుండి ప్రవహిస్తూ దేవుని యొక్క లక్షణాలను మానవులకు నేర్పించు అధ్యాపకులుగా మన కళ్ళముందున్నా మానవుడు వాటిని గ్రహించలేక తనకున్న మిడి మిడి జ్ఞానం గొప్పదని భావించుచున్నాడు. ఒక విధముగా చెప్పాలంటే మానవుడు ఎప్పటికీ ప్రకృతి నుండి తెలుసుకొని నేర్చుకొనవలసిన విద్యార్థి మాత్రమేనని ఈనాటికైనా తెలుసుకోవాలి. దేవుని యొక్క శక్తి స్వరూపాలు ఆయన మాట వలన కలిగిన ప్రకృతి కలిగి ఉందే గానీ సాక్షాత్తు దేవుని యొక్క అక్షయబీజం నుండి ఉద్భవించిన మానవునిలో ఆయన లక్షణాలు కనిపించుచున్నాయా ?

**కీర్తన 19 : 1, 4 ఆకాశములు దేవుని మహిమను వివరించుచున్నవి. అంతరిక్షము ఆయన చేతిపనిని ప్రచురపరచుచున్నది. పగలు, రాత్రి బోధలు చేస్తూ జ్ఞానము తెలుపుచున్నది.**

**హబక్కూకు 2 : 14 సముద్రము జలములతో నిండియున్నట్టు భూమి యెహోవా మహత్యమును గూర్చిన జ్ఞానముతో నిండియుండును.**

ఆయన మాట వలన కలిగిన ప్రకృతిలోనే మహా జ్ఞానాన్ని మనిషికి పొందుపరిచాడని మనకు అర్థమగుచున్నది.

ఆ ప్రకృతిని సరిగా మనం అధ్యయనం చేయగలిగితే శాశ్వతమగు ఆయన జీవమును గూర్చి, ఆయన ప్రభావ మహిమలను గూర్చి తెలుసుకొనగలము.

దేవుడు శక్తి స్వరూపుడైనప్పుడు ఆయన నాశనం లేని జీవం కలిగినప్పుడు మరి ఆ జీవం వలన కలిగి, జీవం గలిగిన ప్రకృతికి నాశనముందంటారా ? ప్రకృతిలో మనిషి నేర్చుకున్న సూత్రాల ప్రకారం శక్తిని భరిస్తూ, శక్తి మరియు జీవం కలిగిన ఈ పంచభూతాలకు నాశనం ఉంటుందంటారా ? సృష్టింపబడని శక్తికి నాశనమే లేనప్పుడు ఈ శక్తులను కలిగిన ప్రకృతికి నాశనముందంటారా ? ఇదే ఈ ప్రపంచానికి బైబిలు తెలియజేసే అద్భుత సత్యం. అయితే శక్తి యొక్క ముఖ్య సూత్రాలలో అది ఒక రూపంలో అదృశ్యమైనా మరొక రూపంలో ప్రత్యక్ష్యమౌతుందే గానీ నాశనం మాత్రం సంభవించదు. నేటి ప్రపంచ పరిస్థితిని గమనించగలిగితే ఈ భూగోళాన్ని 100 సార్లు తగులబెట్టే మారణాయుధాలు ప్రపంచ అన్ని దేశాలలో గుట్టలు గుట్టలుగా పేరుకుపోయాయి. ఈ ప్రపంచం నాశనం కాబోతుందని త్వరలో అగ్నిగోళంగా మారనుందని ఎంతో మంది అభిప్రాయపడుతున్నారు. వారి కంటే ముందుగా బైబిలు కూడా ఈ ప్రకృతి అగ్నితో దహించుకుపోనుందని జోస్యం చెప్పింది.

**2పేతురు 3:7 ఇప్పుడున్న ఆకాశం భూమియు అగ్నికొరకు నిలువ చేయబడినవై, అదే వాక్యము వలన భద్రము చేయబడియున్నవి.**

పాఠకులు ఇక్కడొక విశేషమైన సంగతిని గమనించగలగాలి. నాశనం కాబోతూ అగ్ని జ్వాలలలో మండిపోనున్న భూమి ఆకాశాలు ఏ వాక్యమువలనైతే నిర్మాణమయ్యాయో అదే వాక్యము వలన "భద్రము" చేయబడియున్నవి అంటున్నాడు. నాశనం కాబోతున్నది భద్రము చేయబడడం ఏంటి? అంటే దేవుని శక్తియొక్క లక్షణాలను కలిగిన ఈ ప్రకృతి ఎన్నటికీ నాశనం కాలేదు గానీ తన రూపాన్ని మాత్రం మార్చుకోగలుగుతుందని గ్రహించగలగాలి. ఇప్పుడున్న ఈ ఆకాశం, భూమి ఇకమీదట కనబడకుండా పోవుగానీ దేవుని మాట వలన సృష్టించబడి శక్తిని కలిగిన ఈ పదార్థమంతా తన రూపాన్ని మార్చుకుంటుందే గానీ కనబడకుండా మాత్రం పోదు. ఇక్కడ మానవుడు తెలుసుకున్న సూత్రాలను ఒక్కసారి జ్ఞాపకం చేసుకొండి. శక్తి ఒక రూపం నుండి మరొక రూపంలోక్కైతే మారగలుగుతుంది గాని శక్తికి ఎన్నడూ నాశనం లేదు. అది దేవుని నోట నుండి వచ్చిన మాటైనా సరే నాశనం కావడానికి వీలులేదు. **(యెషయా 55:10,11)** అందుకే ఈ భూమి ఆకాశం అగ్నితో మండిపోయి తన రూపాన్ని మార్చుకొని మరో రూపంలోకి మార్పు చెందాలి గనుకనే అవి అదే వాక్యము వలన భద్రము చేయబడియున్నవి.

**2పేతురు 3 : 10, 13 ఆ దినమున ఆకాశములు మహాధ్వనితో గతించిపోవును, పంచభూతములు లయమైపోవును. అయినను మనమాయన వాగ్దానము బట్టి క్రొత్త ఆకాశం కొరకును, క్రొత్త భూమి కొరకును కనిపెట్టుచున్నాము.**

**యెషయా 66 : 22 నేను సృజింపబోవు క్రొత్త ఆకాశమును క్రొత్త భూమియు లయము కాక నా సన్నిధిని నిలచును. ఇదే యెహోవా వాక్కు.**

**ప్రకటన 21 : 1 అంతట క్రొత్త ఆకాశమును క్రొత్త భూమిని చూచితిని. మునుపటివి గతించిపోయెను.**

**రోమా 8 : 19-21 సృష్టి దేవుని పిల్లలు పొందబోవు మహిమ గల స్వాతంత్ర్యం పొందుదునను నిరీక్షణ కలిగి ఉన్నది.**

పై మాటలను బట్టి ఒకనాడు సృజింపబడిన ప్రకృతి అంతా నాశనం కావటం లేదు గానీ తన రూపాన్ని మాత్రం మార్చుకొని క్రొత్త ఆకాశము క్రొత్త భూమిగా మారిపోతున్నాయి. ఎందుకంటే జీవానికి శక్తికి నాశనం, ముగింపు లేవు గనుక.

ప్రకృతిలోని ఏ జీవమైనా రూపాన్ని మార్చుకొనగలదే గానీ నాశనం కాలేదని వేల సంవత్సరాల క్రితమే బైబిలు చెప్పిన అద్భుత సత్యం. మనకందరికీ తెలిసిన ఒక విచిత్రమైన ప్రక్రియ దేవుడు మనకు నేర్పించడానికి ఈ ప్రకృతిలో పెట్టాడు. అదేమనిన నల్లని వెంట్రుకలతో పాకే గొంగళిపురుగు ఎగిరే సీతాకోకచిలుకగా మారిపోతుంది. ఈ ప్రక్రియలో జీవం ఒక్కటే గానీ రూపాలు వేరు. అంటే శక్తి రూపాలు మారుతాయన్న సత్యాన్ని దేవుడు మనకి చూపించాడు. అలాగే ఒక

చింతపిక్క నేలలో పడి చచ్చిపోయి కుళ్ళిపోతుందని మనమనుకుంటున్నామే గానీ ఒకనాటి పిక్క రూపాన్ని విడచి మహా వృక్ష రూపంలోనికి ఆ ఒకే జీవం మారగలుగుతుందని గ్రహించగలగాలి. దేవుడు సృష్టించిన సమస్తమును శక్తి కలిగియున్నది, శక్తితో నిండియున్నది. ఆ శక్తి శాశ్వతమైనది, దాని కెన్నటికీ నాశనం లేదు. **1 పేతురు 1 : 22 మీరు క్షయ బీజము నుండి కాక శాశ్వతమగు జీవము గల దేవుని వాక్యం.....**

దేవుని వాక్యానికి నాశనం లేదు గానీ అది శాశ్వతమైనది, జీవము గలిగిన మాట. ఆ శక్తి తన రూపాన్ని మార్చుకొనగలదే గానీ ఆ శక్తికి నాశనం లేదు, నాశనం కాలేదు. ఈ నగ్న సత్యాన్ని క్రీస్తు తన జీవితంలో చేసి చూపించి ఈ ప్రపంచాన్ని సంభ్రమాశ్చర్యాలలో ముంచాడు. ఈ ప్రపంచం ఆయనను శిలువ వేసి చంపినా నాశనం లేని ఆయన శక్తి తిరిగి లేవటమే కాకుండా ఒక రూపం నుండి మరో రూపంలోనికి మార్పు చెందాడు.

**మార్కు 16 : 12 ఇద్దరు ఒక పల్లెటూరికి నడిచి పోవుచుండగా, యేసు మారు రూపము గలవాడై వారికి ప్రత్యక్షమాయెను.**

శక్తి రూపాలను మార్చగలదు గానీ దానికి నాశనము లేదనుటకు క్రీస్తే ప్రత్యక్ష సాక్ష్యం. మన కళ్ళముందున్న పక్షులు, మృగాలు, జీవరాసులు చనిపోయి నాశనమైపోతున్నాయని భావిస్తున్నామే గానీ అవి తిరిగి మట్టిలో మట్టిగా మారి తమ రూపాన్ని మార్చుకుంటున్నాయి. వీటి శవాలు మట్టిలో కలవడం వలన మొక్కలకు జీవం, నేలకు సారం వస్తుందని ఇప్పటికి శాస్త్రం నేర్చుకున్నది. గనుక వీటన్నిటిని బట్టి ప్రకృతిలో దేవుని ద్వారా చేయబడిన దేనికినీ ఎప్పటికినీ నాశనం లేదు. మరో విచిత్రమైన సంగతి ఏమిటంటే ఆయన మాట వలన కలిగిన దూతలకు కూడా ఎప్పటికీ నాశనం లేదు. వాటి నుండి దయ్యంగా మారిన సాతానుకు కూడా ఎన్నటికీ నాశనం లేదు. అందుకే క్రీస్తు వచ్చినప్పుడు అది కనబడకుండా పోదు గానీ నిత్యము బాధింపబడే నాశనంలోకి పోతుంది.

**మత్తయి 25 : 41 అప్పుడాయన యెడమ వైపున ఉండువారిని చూచి శపించబడిన వారలారా, నన్ను విడిచి అపవాదికిని వాని దూతలకు సిద్ధపరచబడిన "నిత్యాగ్ని" లోనికి పోవుడి.**

**ప్రకటన 20 : 10 అపవాది అగ్ని గంధకములు గల గుండములో పడవేయబడెను. అక్కడ క్రూరమృగము అబద్ధ ప్రవక్తయు ఉన్నారు. వారు "యుగయుగములు" బాధింపబడుదురు.**

దీనిని బట్టి దేవుని వాక్యము నుండి సృజింపబడిన దేనికినీ ఎన్నటికినీ నాశనం లేదను సత్యాన్ని గ్రహించగలగాలి. శక్తి యొక్క నిత్యత్వ సూత్రాలను మనిషి ప్రకృతిని చదివి నేడు నేర్చుకున్నాడేమో గానీ దేవుడు అవి నిత్యమని ఏనాడో బైబిలు నందు పొందుపరిచాడు. చివరకు ఆయనాత్మను పంచుకొని జన్మించిన మనకునూ ఎన్నటికీ నాశనం లేని వారంగా అయితే అగ్ని ఆరని గుండములో చావు లేని ఆత్మగా నాశనమను నిత్య శిక్షను అనుభవిస్తూ ఉండాలి లేక నిత్య జీవితంలో నిత్యమూ తండ్రితో ఉండాలే తప్ప ఒకేసారి అదృశ్యమయ్యేవారం మాత్రం కాదు. ఆయన మాట వలన కలిగిన ప్రకృతికే నాశనం లేనప్పుడు సాక్షాత్తు ఆయన స్వరూపమందు చేయబడిన నీకూ, నాకూ నాశనమెక్కడిది? ఇంతటి పరిజ్ఞానాన్ని వేల సంవత్సరాల క్రితం దేవుడు తన గ్రంథమైన బైబిలు నందు మానవాళికి ప్రబోధించినా వేదాన్ని ప్రక్కకు నెట్టి నిన్న గాక మొన్న పుట్టి ప్రకృతి యొద్ద నేర్చుకున్న తమ వాదానికి ప్రాధాన్యత నిచ్చిన వీరు దేవుని జ్ఞానమును మించిన వారు మాత్రం కారు. కొన్ని సంవత్సరాల క్రితం చెప్పిన శాస్త్రజ్ఞుల మట్టి జ్ఞానానికే ఈ ప్రపంచం విలువ నిచ్చింది గాని దేవుని వేదాన్ని మత గ్రంథమనే ముద్ర వేసి మరుగున పెట్టింది. 16, 17, 18 శతాబ్దాల మధ్య కాలంలో జన్మించిన Issac Newton, James Prescott Joule, John Dalton లాంటివారు చెప్పిన **"శక్తి నిత్యత్వ సూత్రాలు"** ఈ ప్రపంచం వళ్ళించిందే తప్ప మహా వేద గ్రంథమైన బైబిలులోని దేవుని శక్తి స్వరూపాలను ప్రక్కకు నెట్టింది. ఓ మనిషీ! ఇప్పటికైనా కళ్ళు తెరచి బైబిలు ఆహ్వానాన్ని స్వీకరించి వేదసారాన్ని అనుభవించి అజ్ఞానివి కాక జ్ఞానివి కమ్ము. ఈ శతాబ్దానికి నీకిదొక చివరి అవకాశం.